చ. అని యువరాజు వాలిసుతుఁ ♦ డాడిన వానరులెల్ల నొక్కరీ
తిని గరుణంబుగా ననిరి; ♦ తీక్ష్ణతరంబగు దుస్స్వభావముం
గను రవిసూనుఁ, డర్కకుల ♦ కాంతుఁడు రాముఁడు కాంతయందుఁ బ్రే
మను గనువాఁడు గావున క్ష ♦ మానుతఁ గానక యెల్లవారముఁ౯. ౩౮½ 1853

క. తనచెంతకు రాఁ గని రాముని కప్రియంబుగనె మనల ♦ ముందుగ వధియిం
చును సంశయంబులే దిఁక, మన మరుగుటఁ దగదు కీశ ♦ ముండను దరికి౯. ౩౯

క. ఎవఁడపరాధ మొనర్చెనొ, యానీతునికికను నాశఁ ♦ డనుగండగదో
యువరాజా! సీతాదేవి వెదకి యవ్వార్తనెల్ల ♦ విధములఁ దగఁగా౯. ౩౯½

తే. ఎఱుఁగఁజాలితిమేని క ♦ పీశుఁ డగుచు
వీరుఁడౌ సూర్యతనయుని ♦ యీటి కరుగు
దము, మహీసుతవార్తసుం ♦ తయును దెలియ
దేని యిచటనె యసువుల ♦ నెల్ల విడిచి ౪౦ 1856

క. అరుగుదము యమునియింటికిఁ, బరుఁడి నని; రట్లు వాఁ ♦ భయమున వ్యథలం
గర మనుభవించు నవ్వన,చరులాడినపల్కులు విని ♦ సాధుశిఖామణి౯. ౪౧

క. వారల కిట్లని చెప్పెను, దారుఁడు వగమటయుఁ జాలుఁ ♦ దగ నామాటల్
మీఁరిష్టపడిన నీబిల, మేరీతిగనైనఁ జొచ్చి ♦ యిందుండ మిఁక౯. ౪౧½ 1858

సీ. ఇది మాయచే రచి ♦ యింపఁగాఁ బడినదిగద, యట్లుగాన నె ♦ క్కరణినైనఁ
జొరఁగరా దెవరికిఁ ♦ దరువులు జలములు భోజ్యపదార్థముల్ ♦ పుణ్యపాన
నద్రవ్యములు చాలఁ ♦ గాఁ గల విందులోఁ గాన వానార్తి మా ♦ కొండరంబు;
శక్రరాఘవకపి ♦ వత్తములవలని భయ మినుమంతయుఁ ♦ బర్వదిచట;
తే. ననుచు నంగదుపల్కుల ♦ కనుమతించు
నట్లు తారుండు చెప్పిన ♦ యప్పలుకుల
వనచరుల్ విని కార్య మొ ♦ ప్పంగఁ జేయ
హింస గలుగదొ యటుచేయుఁ ♦ డిప్పు డనిరి. ౪౨½ 1859

ఏఁబదిమూఁడవ సర్గము సంపూర్ణము.

---

## ౫౪ - వ సర్గము.

హనుమంతుఁ డంగదుని యభిప్రాయమును దూఁగనాడుట.

చ. హనుమయుఁ దారకాధిపని ♦ భాననుఁడై తగు తారుఁడిట్టు ల
వ్వనచరసంఘముం బలుక ♦ వాలిసుతుం డిఁకఁ గీశరాజ్యముం
గొనునని యెంచె; నయ్యనిలు ♦ కూర్మికుమారుఁడు వాలిపుత్త్రుఁడై
తనరెడు నంగదుం గని ని ♦ తాంతము బుద్ధిఁ దలంచె నివ్విధి౯. ౧ 1860

[1]సీ. శ్రవణశుశ్రూషలు ♦ గ్రహణము, ధారణ మట్లూహాపోహ♦లర్థమెఱుఁగు
టయును దత్త్వమెఱుంగు♦టయు నను నెనిమిదిగుణములు గల్గి, నా♦ల్గువిధములగు
బలము లనంబడు♦ బాహుమనోబలంబు లుపాయబంధుస♦ద్బలము లలర,
దేశకాలంబుల♦ దెలియఁగెఱుంగుట దార్ఢ్య మెల్లకష్టములస♦హించుటయును
సకలమెఱుంగుట♦ సామర్థ్యమును బూన్కి యూహను వెలిఁబుచ్చ♦కుండుటయును
తే. సత్యశౌర్యంబు లితరుల♦శక్తి నెఱుఁగఁ
జాలుటయును, గృతజ్ఞత ♦ శరణుఁ జొచ్చి
నట్టివారలపై జాలి ♦ యాగ్రహమును
గనమి చపలత లేమి నాఁ ♦ గ్రాలు నివ్వి. ౨ 1861

క. పదునాల్గుగుణము లనఁగా, విదితములగు నివ్వి గలిగి ♦ వెలయు ననుచు నెం
చెఁ దనమనమ్మున; శుచిసంపద శశిశుక్లాది వరుసఁ ♦ బ్రబలెడురీతిన్. ౩

క. వయసం దేజోబలములు, పరాక్రమము పెంపుమీఱఁ ♦ బటుబుద్ధిని నా
గురుతుల్యుఁ డగుచు శౌర్యస్ఫురణంబునఁ దండ్రియట్లు♦ పొలుచుచుమిగులన్.

[2]క. గురునీతి వినెడు శక్రుని, కరణిన్ దారోక్తి వినుచు ♦ క్ష్మాపతి యగునా
సరసిజబాంధవపుత్రునిఁ, బరమార్థము చేయఁబూని ♦ బడలినవానిన్. ౪

తే. సర్వశాస్త్రవిశారదు ♦ శౌర్యసారు
నంగదుం గని పినతండ్రి ♦ కతఁడు వేఱు
పడక యనుకూలుఁ డగురీతిఁ ♦ బలుకఁ దొడఁగె
ననిలసూనుఁడు నీతివ♦చనము లలర. ౫ 1865

క. ధరసామదానభేదము, లరయన్ దండమనఁజాలు♦నట్టి యుపాయో
త్కరమునఁ దృతీయ మనఁగాఁ, బరఁగెడు భేదమును బూని♦పవనతనయుఁడున్.

క. వనచరులెల్లను నంగదు, ననుమతమున నాబిలంబు♦నందుఁ జొరఁగఁబూ
నినపని మాన్పను వాక్పటుతను వానరు లతనిమాటఁ ♦ దలఁప రని మదిన్.

ఆ. నిశ్చయించుకొనుచు ♦ నిల్చి కోపవ్యపా
యము నాల్గవదయి ♦ పరఁగుచున్న
యా యుపాయమరాని ♦ యతిభయదములగు
పలుకులను వచించి ♦ వాలిజునకు. ౬ 1868

క. మనమున భయముం గల్గించెను మరలం బల్కె నిట్లు; ♦ చిన్నికుమారా!
యని నీవు తండ్రికంటెను, ఘనుఁడవు గద! తండ్రియట్లె ♦ కపిరాజ్యంబున్. ౭

క. సరిగా వహింపఁజాలుదు, సరయన్ గపినాథ! వనచ♦రావళి యొప్పద

---

2 బుద్ధ్యా హ్యష్టాంగయా యుక్తం చతుర్బలసమన్వితమ్, చతుర్దశగుణం మేనే హనుమాన్ వాలినస్సుతమ్-అనియూ. దీనివ్యాఖ్యానాభిప్రాయము లిటుఁ దెల్పఁబడినవని తెలియఁదగును. 3 శుశ్రూ
శక్తే రివ శ్రావితమ్-అనియూ.

స్థిరచిత్తమునఁ జెలంగును, దరుణులఁ బుత్రకుల వీడి ♦ త్వత్స్మృతిరీతిన్. ౮౹

క. చరియింప నొల్ల దెంతయుఁ, సరిగా నీయెదుటఁ జెప్పఁ♦జాలదు విను వా
నరరాజు జాంబవంతుఁడు, గురుకపియగు నానుహోత్ర♦కుఁడు నీలుండున్. ౯౹

క. నిను సేవించుచు నుండం, గను జాలరు; నేను నల్లె ♦ గావున సామా
దినిఖిలపదుపాయంబులఁ, గొని దండోపాయమైనఁ ♦ గొని మన్మొల్లన్. ౧౦౹

క. ఇనతనయుచెంతనుండియె, నినుఁ జేరఁగఁ దీయలేవు ♦ నిశ్చయ మిది నూ!
విను బలహీనునితో బలముస నొప్పు జనుండు వైర♦మును గొనఁ జెల్లున్.

క. అని నీతివేత్త లందు ర,కని బలహీనుండు వగను ♦ బలవంతునితోఁ
గొనుటొప్పదు బలహీనుఁడు, దనుఁ గాచుకొనంగఁ దగుని♦తాంతముకానన్.

క. బలవంతునితోఁ బగఁగొను, టిల నేమాత్రంబు గూడ ♦ దివు డాత్మబలం
బులు లేకయున్న నీఘున, బిలమే రక్షకమటంచు ♦ వే తలఁచెదవో. ౧౩౹

సీ. తారుఁడీ బిలమని ♦ గారవంబునఁ జెప్పినట్టి యాగుహాను శ♦రాళిఁగూల్ప
మనలక్ష్మణునకు ధీ♦ఘనునకు లక్ష్యమే యల్పకార్యముగద ♦ యమరపతియు
మును మయనామక♦దనుజుని గూర్చి యీబిలముఁ బయిన్ వజ్ర ♦ మలఘుగతిని
వైచి యల్పమె చేసెఁ♦బసివైరమున ద్వారమునుమాత్రమే తాను♦నొనరఁజేసెఁ
తే. గాని లక్ష్మణుఁడో యిప్డు ♦ దీనిఁ బత్ర
పుటమువలె భీమనాయకం♦బుల రు జీల్పఁ
గలఁడు; వజ్రాశనిసమాన♦ములు నసాన
శక్తికంబులు నగునట్టి♦నాయకములు. ౧౪౹ 1876

క. కలవెన్నియొ గిరీంద్రం,బులనున్ భేదింపఁగలవు; ♦ పూని విరోధం
బల సుగ్రీవునితో నీ, బిలమున నీవుండునట్టి♦వృత్తిఁ గొనినచోన్. ౧౫౹

ఉ. వనచరులెల్ల నిన్వీలి ♦ వైళము నిశ్చితచిత్త మొప్పఁగాఁ
జనఁగల; రొక్కవేళ విడఁ♦జాలక నిన్నును గూడియుండఁగా
మనముల నెంచి రేని తమ♦మానినులన్ సుతులం దలంచుకొం
చనయముఁ దాపమొందుచును ♦ నాఁకలిబాధలఁ జిక్కి దీనులై. ౧౬౹ 1878

తే. మంచిశయ్యలు లేమి ని♦స్పృహిఁ బరుండ
నేర కంతట వెనుకనె ♦ నిన్ను విడిచి
పోవఁగల; రంత మిత్రుల ♦ నీవు పాసి
హితము గోరెడు బంధుల♦నెల్ల వదలి. ౧౭౹ 1879

చ. అనిలుని తాఁకునం గదలు♦నట్టి తృణంబునకంటె హీనతం
గని దిగులొంది కుందుదువు; ♦ గాఢరయంబున గల్గి వైరులం
దునుముచు నైపుణాలనిగ♦తుల్ దగనొప్పెడు లక్ష్మణేషువుల్
నిను నవవృత్తిఁ జంపకయె ♦ నిల్వవు సుమ్ము మహేంద్రపౌత్రకా! ౧౮ 1880

క. విను మీవిఁక మాతోడం, జనుదెంచి వినీతుఁడవయి ♦ సమధికభక్తిం
గనియున్న సంగదా! యా,యినతనయుఁడు తనకు వెనుక ♦ నెలమి మిగులఁగన్.

క. వనచరరాజ్యంబునకున్, నిను నధిపతిఁ జేయఁగలఁడు ♦ నీదుపితృవ్యం
డును ధర్మాత్ముఁడు ప్రీతిని, గనఁ జేయు దృఢవ్రతుండు ♦ గడు శుచియు నగున్.

తే. మఱియు సత్యప్రతిజ్ఞుఁడు ♦ మహితకరుణుఁ
డట్టులౌట నొకప్పుడే ♦ సతఁడు నిన్నుఁ
జంపనొల్లఁడు; వినుము నీ ♦ జననియందుఁ
బ్రియము గలవాఁడు గోరుఁ ద ♦ త్ప్రియమె సతము. ౨౧ 1883

చ. వనచరనాథు ప్రాణములు ♦ వారక నీజననీవశంబు లే
తనయెడ వామె కీవె కద ♦ తప్పక రాఁజను నీకు వానరే
శునకును నీవు దక్క ♦ తనుజుల్ మఱి లేరుగదా యెఱుంగవే
గనుక విభీతి నీవు చనఁ ♦ గాఁ దగు నాతనిపాలికీయెడన్. ౨౨ 1984

ఏఁబదినాలుగవ సర్గము సంపూర్ణము.

---

## ౫౫ - వ సర్గము.

అంగదాదులు ప్రాయోపవేశము చేయుట.

తే. వినయయుక్తము ధర్మసం ♦ విహితమగుచు
స్వామిసత్కారయుక్తమై ♦ పవనతనయ
సంప్రహితమైన యావాక్య ♦ జాలము విని
యంగదుం డిట్లు పలికె నా ♦ హనుమతోడ. ౧ 1885

*సీ. ఆత్మశుద్ధియు స్థైర్య ♦ మానృశంస్యము మనశ్శౌచ మార్దవమును ♦ శౌర్యమట్లె
గాంభీర్యమును గపి ♦ కాంతునియందు లే వగ్రజుండగు శక్రు ♦ నాత్మజుండు
బ్రదికియుండంగనే ♦ పట్టమహిషియుఁ దత్ప్రియపత్నియును మఱి ♦ విమలధర్మ
మునఁ జూడఁ దనకును ♦ జననివంటిదియు నౌ తారను లోకులు ♦ తలఁచి యోష

తే. గించుకైన స్వీకరించె; న ♦ చంచలాత్ముఁ
డైన తనయన్న యనిసేయు ♦ నద్రిబిలముఁ
జొచ్చునప్పుడు కావుంచి ♦ హెచ్చరించి
చనిన దానిఁ గప్పెఁ బా ♦ షాణమునను. ౪ 1886

క. విను మిట్టివాని కెవ్విధ,మునఁ దెలియును ధర్మమార్గ ♦ ములు, తాను గరం
బును బట్టుకొనుచు సత్యం,బును జేసినయట్టి రాము ♦ మూర్తి ఘనబలున్. ౫

---

* భ్రాతుర్జ్యేష్ఠస్య యో భార్యాం జీవతో మహిషీం ప్రియాం, ధర్మేణ మాతరం యస్తు
స్వీకరోతి జుగుప్సితః-అనిమాలమా.

క. తనకుపకారము చేసిన, ఘనకీర్తియుతుఁ మహాత్ముఁ ♦ గపిపతి మఱచెన్;
గనుక నితండు కృతఘ్నుం, డనఁగాఁ దగు నెవనియెడల ♦ ననిలతనూజా!. ౭ 1888

సీ. "సేనలఁ బిలిపించి ♦ శ్రీరామునందుఁ గృపారసంబును గపి♦పతియుఁ జూపఁ
డేయందువో." విను ♦ మీతఁడు లక్ష్మణుభయమున జనకుని♦పట్టి వెదక
మనలఁ బంపెను నధ♦ర్మభయహేతువునకు భయపడి కాదుగా♦భానుతనయుఁ
డిట్టివాఁడౌటచే ♦ నిఁక ధర్మమాతనియందెట్టులుండునో ♦ యనిలతనయ
తే. నిట్టులు కృతఘ్నుఁ డతిపాపి ♦ స్మృతివిహీనుఁ
డతిచలాత్ముఁడునై నట్టి ♦ యర్కతనయు
నందుఁ దద్వంశజుఁడు జీవి♦తాశగలుగు
జనున కేయార్యునకును వి♦శ్వాస మొదవు. ౮ 1889

క. ఇనజుఁడు సుగుణయుతుండై,నను విగుణుండైన నాత్మ♦నందను రాజ్యం
బుననుంచుఁ గాని శత్రువు,తనయుఁడనగు నన్ను బ్రదుకఁ♦దలఁచునె చెపుమా.

చ. విను పినతండ్రిబాధలకు ♦ వేసరి నేనపరాధమున్ బొన
ర్పను దగునంచుఁ జేసితిని ♦ వైరము గైకొని యీమహాబిలం
బున వసియింత మన్నవిధ♦ముం దగ వెల్లడియయ్యె నేమనం
జనుఁ బ్రభుమంత్రముఖ్యగురు♦శక్తులు నాయెడలేవు గావునన్. ౯ 1891

ఆ. ఇట్టినే ననాథు♦నట్టులు గిష్కింధ, కరుఁగువాఁడనేని ♦ యందు నెట్లు
బ్రదుకఁగలుగువాఁడ ♦ బలహీనుఁడనుగానఁ, గపివరుండు శఠుఁడు♦ఘాతుకుండు.

తే. మఱియుఁ గ్రూరుఁడు కాన ధ♦ర్మమును గొనక
రాజ్యకారణమున నన్న♦రాతి బంధ
నాదుల రహస్యముగ మృతి♦నందఁజేయు;
నురులలోఁ జిక్కి మృత్యువు♦నొందుకంటె. ౧౦ 1893

క. ప్రాయోపవేశమును గొని, యీయెడఁ బ్రాణముల మాను♦టే మేలగు నా
కో యనుచరులారా నా, కీయనుమతి నిచ్చి యిండ్ల♦కేగుఁడు మీరల్. ౧౧

క. వినుఁ డేఁ బ్రతిజ్ఞ చేసెదఁ, జనుదేరఁగఁ బూనఁ బురికిఁ ♦ జయ్యన వ్రతముం
గొని యిందె మృతిని బొందెద,*వని నిటఁ జచ్చుటయె మేలు♦వచ్చుటకంటెన్.

సీ. బలవంతులగు రామ♦భద్రలక్ష్మణులను గని నాకుగా మ్రొక్కి♦వినయయుక్తిఁ
గుశలంబు మీరడు♦గుఁడు వానరేంద్రున కభివాదన మొనర్చి ♦ యతనికుశల
మడుగుఁడు పినతండ్రి♦యగురాజు వతఁడగుఁ; బినతల్లియైనరు♦మను బ్రియంబు
గాఁ గనుంగొని యడు♦గందగు నారోగ్యకుశలంబులను నాదు♦మూర్తి జనని
తే. యైన తారను దేవ్వడీ ♦ యర్థవచన
ములను, నాతల్లి తానై జ♦ముగ నె పుత్ర

* [illegible]

వాంఛ గలయది ప్రీతియుఁ, ♦ బలుకఁజాల
నామెఁ దలఁచిన జాలి నా♦కలరకున్నె. ౧౫ 1896

క. నను దయమెయిఁ గాంచెదు నా, జననియు నేవిందు నిట్లు ♦ చప్పుట వినినేఁ
దనజీవితముల విడచును, వినుఁడిది సత్యంబటంచు ♦ వివరించి తగన్. ౧౫॥

చ. వనచరవృద్ధులం గనుచు ♦ వారికి వందన మాచరించి తా
మనము గలంగ నేడ్చుచు క్ష♦మాస్థలి దర్భలపైఁ బరుండెఁ; న
య్యనఘుఁడు వాలిసూను డిటు♦లుండఁ బరుండఁగఁ గాంచి వృద్ధులౌ
వనచరు లశ్రులన్ విడచి ♦ పట్టఁగఁ జాలనిచింతలం దగన్. ౧౬॥ 1898

ఆ. కనులనుండి బాష్ప♦కణములు వేఁడిగాఁ, గాఱ నేడ్చి రంతఁ; ♦ గపివరేణ్యు
లర్కతనయుఁ దిట్టి య♦వ్వాలి నుతియించి, చుట్టుముట్టి వాలి♦సుతుని వసుధ.

తే. తారుఁ బ్రాయోపవేశ మా♦తనిని గూడి
చేయఁగా నిశ్చయంబును ♦ జేసికొనిరి;
వారు తన్మత మెఱిఁగి య♦ప్పంగి నొనరు
చుటయె యుత్తమమనుచు నెం♦చుచును వేగ. ౧౮ 1900

క. సలిలంబుల స్పృశియించుచు, బలువిడి నుత్తరతటైక♦భాగంబున ద
ర్భల యామ్యాగ్రంబులుగా, వలరించుచుఁ బ్రాఙ్ముఖముగ♦నందఱు పూన్కిన్.

తే. వానిపైని బరుండి రి♦ప్పంగిఁ దారు
మరణమొందుట మేలని ♦ మదుల నెంచి
యంత రాముండు వనమున ♦ కరుగుదెంచు
టయు దశరథుఁడు మృతిఁ బొందు♦టయును బిదప. ౨౧ 1902

సీ. ఆజనస్థానంబు♦నందు ఖరాదులఁ జంపుటయును వంత ♦ జనకజాప [ముఁ
హారణంబును జటాయు♦వనిఁ జచ్చుటయుయుద్ధమున వాలి నొకశర♦మున వరా
దంత మొందించుట ♦ యర్కజుపై రాముఁ డాగ్రహించుటయును ♦ నవల సీత
వెదకంగ వానర♦వీరుల సుగ్రీవుఁ డఖిలదిక్కులకును ♦ ననుపుటయును

తే. దమకు రానున్నభయమును ♦ దప్పకుండ
మొదటినుండియు నక్కపి♦ముఖ్యు లచటఁ
జెప్పుకొనుచుండి; రట భూరి♦శిఖరిశిఖర
నమత నొందెడు నక్కపీ♦శ్వరులు నియతి. ౨౩ 1903

చ. వ్యసనములు గల్గఁ జెప్పుచును ♦ క్ష్మాస్థలిపైని బరుండి రంతటన్
ఘనములు ఘోరభంగిగను ♦ గర్జనముల్ పొనరించుచాడ్పునన్
జెనురవ ముప్పతిల్లి యట ♦ శీఘ్రగిరీశ్వరకందరాంతరా
ళిని బ్రతినాదముల్ గలుఁగ ♦ లీల నొనర్చెను నొక్కమాఱుగన్. ౨౩॥ 1904

ఏఁబదియైదవ సర్గము సంపూర్ణము.

---

## ౫౬-వ సర్గము.

సంపాతి వచ్చుట, వానరుల కలవరము.

*క. వనచరులెల్లను భూధ్రం, బునఁ దగఁ బ్రాయోపవేశ♦మును గొని శయనిం
చిన యచటికి గృధ్రేశ్వరుఁ, డనఁబడు సంపాతి రాఁగ♦ నారంభించెన్. ౧

సీ. చిరకాలజీవియు ♦ శ్రీమంతుఁ డాజటా♦యువునకు నన్నయు ♦ నుగ్రశౌర్య
బలముల విఖ్యాతిఁ ♦ బడసినవాఁడును నైన సంపాతి విం♦ధ్యాద్రికంద
రమునుండి వెలువడి ♦ ప్రాయోపవిష్టులై యటనున్నకపులను ♦ నంతఁ గని
సంతుష్టుఁడై యిట్లు ♦ చక్కఁగ వచియించె; జగమున దైవంబు ♦ జనులకెల్ల
తే. తత్ఫలములఁ గూర్చుచుండును ♦ జిత్తమునకు
ముదము గల్పించు నీభక్ష్య♦మును బహుదిన
ములకు నాకును గల్పించెఁ ♦ జెలఁగి యిద్ది
నాకడకె వచ్చినది తనం♦తన విధిగతి. ౨ 1906

క. వనచరులనెల్ల నొక్కొ, క్కనిగానేఁ జంపి చంపి ♦ కడుఁ దమిమీఱఁ దినియెద నని వానరులం, గని పల్కెను నిట్లు గృధ్ర♦కాంతుఁడు కడఁకన్. ౩

క. తనతిండికొఱకుఁ బేరా,శను గొని యనునట్టి వాక్య♦జాలము వినుచుం
జెనుభీతిఁ బొంది యంగదుఁ, డనియెన్ హనుమంతుతో మ♦హార్తింగనుచున్.

క. వనచరుల విపత్తికి సూ,ర్యునితనయుఁడు యముఁడు తానె ♦ యుపగృధ్రంబై
చనుదెంచినాఁడు పవనజ, కనుమా! యిచ్చటికి జనక♦కన్య నెపమునన్. ౬

చ. నరపతికార్యముం దగ నొ♦నర్చినవారము గాము వానరే
శ్వరువచనంబుఁ జేయుటకుఁ ♦ జాలినవారము గాము వాయుజా!
త్వరపడి యింతలోనె యిటు♦వంటివిపద్దశ సంభవించె ని
ట్లురవడి వచ్చునంచు మన♦యూహయు సాగఁగ లేదుగా కటా!. ౮ 1910

చ. జనకజకుం బ్రియంబు తన♦స్వాంతమునం దమిఁ జేయఁగోరి గృ
ధ్రనృపతి యజ్జటాయువు ని♦తాంతము చేసినకార్యమంతయున్
వినినదియేకదా పతగ♦వీరునిభంగిని నెల్లప్రాణులున్
మనవలె రాఘవప్రియము ♦ మానకచేయఁగఁ గోరి యాదృతిన్. ౯ 1911

ఆ. వసలుచున్నవారు ♦ ప్రాణాళిఁ దిర్యక్కు, లట్లె వసలుచున్న ♦ వాత్మజీవ
ములను బ్రాణులెల్లఁ ♦ జెలిమిఁకిఁ గరుణకుఁ, గట్టువడుచు శక్తి ♦ గలిగినట్లు. ౧౦

తే. ఉపకృతిని వేఱు వేఱఁ దా♦రొనరిచెడిని;
ధర్మవేత్త జటాయు వా♦ధరణిపతికిఁ
దాను నుపకారమును జేయఁ ♦ దలఁచి తెగువఁ
దనువు విడుచుచుఁ బ్రియముచే♦సెనుగద తగ. ౧౧ 1913

---

* హారయా గృధ్రరాజ శ్చ తం దేశ ముపచక్రమే-అవిమా.

మీవలన విన్నదానికి ♦ మిగుల మోద
మందితిని; గాన నేను మి♦త్త్రుఁడఁగువాఁడ. ౨౨ 1923

క. అతఁడు జనస్థానమున వ,సతి గావించుకొనియుండు ♦ శౌర్యాధికుఁడై
యతఁడెట్లు చంపఁబడెనో, వితతంబుగ నవ్విధంబు ♦ వివరింపఁదగున్. ౨౩

చ. గురుహితుఁడై నరాఘవుఁడు ♦ కూరిమిఁ గూర్చెడు నగ్రపుత్త్రుఁడై
పరఁగునొ యెనుహీశునకుఁ ♦ బార్థివతల్లజుఁడైన యాజికిన్
గురుగుణుఁడౌ జటాయువున♦కుం జెలికాఁర మదెట్లుకల్గె; భా
స్కరకరవహ్నిఁ బక్షములు ♦ కాలుట నే నిపుడిట్టులైనను. ౨౪ 1925

ఆ. మీరలున్నయెడకుఁ ♦ గోరిన రాఁజాల, నో కపీంద్రులార! ♦ యురుతరకృప
నిట్టికొండనుండి ♦ యెటులైన దింపుఁడీ, యిదియె నాదువాంఛ ♦ యిప్పుడనియె.

ఏఁబదియేడవ సర్గము సంపూర్ణము

---

౫౮ - వ సర్గము.

సంపాతి వానరులతో మాటలాడుట.

చ. వనచరులా పతత్త్రిపతి♦వాక్యము శోకముచేత హీనని
స్వనముగనున్నఁ దమ్ము నొగిఁ ♦ జంపు నతండని శంకనొంది దా
నిని విని నమ్మరైరి; మఱి ♦ నిశ్చలచిత్తము లొప్ప మృత్యువుం
గన నుపవిష్టులౌటఁ బక్ష♦గ ప్రియవాక్యము నేకరీతిగన్. ౧ 1927

తే. నమ్మకుండుటయేగాక ♦ తమ్మునెల్లఁ
బతగ మది తినివేయును ♦ బరవశమున
ననుచు భయదంబుగా దానిఁ ♦ గని వచించి
తమయభిప్రాయముల మాన్పఁ ♦ దలఁపరైరి. ౨ 1928

చ. మరణము నొందఁబూని యిట ♦ స్థాణిపైని బరుండినార మి
త్త్రగుణమునం బతత్త్రి యిది ♦ తప్పక వే మనలన్ క్షుధార్తిచే
మరణము నొందఁజేయ నను♦మానము లేకయె యిష్టసిద్ధిచేఁ
బరఁగినవారమై సఫల♦వాంఛులమౌదు మటంచు నెంచుచున్. ౩ 1929

క. ఒక్కయభిప్రాయమునే, యక్కడ నెల్లరును బొంది; ♦ రపు డంగదుఁ డా
యిక్కకుఁ జని యటనుండియె, గ్రక్కున నాపక్షి దింపి ♦ కడువడిఁ బలికెన్.

*సీ. విక్రమాఢ్యుఁడు కపి♦వీరుఁడు నా ఋక్షరజుఁడన మాతాత ♦ రహిఁ జెలంగె
ధార్మికుండైన యా♦తనికిని శతకోటిపురుషబలంబునఁ ♦ బొలుచువాలి
సుగ్రీవులను తనూ♦జులు నిద్దఱుండిరి; వారిలో నాతండ్రి ♦ వాలి శూర
కృత్యంబులను ధరఁ ♦ గీర్తిని గాంచె; నయ్యిక్ష్వాకుకులమున ♦ నెసఁగునృపుల

* పుత్త్రౌ బలావుభౌ - అనిమూలము. ఓఘ మనఁగా మాఱుకోట్లు.

ఆ. యందు నెల్లధరణి ♦ కధిపతియును మహా
రథుఁడు శ్రీయుతుండు ♦ రాముఁ డనఁగ
దశరథునకు సు ♦ తనయుండు గలఁ డాతఁ
డాదరమున జనకు ♦ నాజ్ఞఁ బూని. ౮ 1931

క. మనమున ధర్మపథంబును, ననువుగ ధరియించి తమ్ముఁ ♦ డౌ లక్ష్మణుఁడున్
జనకజయు వెంటరా వ,చ్చెను వనసీమలకుఁ గార్య ♦ సిద్ధింగనఁగన్. ౯ 1932

తే. అతనిపత్ని జనస్థాన ♦ మందు రావ
ణాసురుండును బలిమిని ♦ నపహరించి
యాకసంబునఁ గొనిపోవు ♦ నపుడు రాము
జనకసఖుఁడౌ జటాయువు ♦ సాధుబుద్ధి. ౧౦ 1933

చ. కనుఁగొని రావణాసురుని ♦ గాఢముగా నెదిరించి స్యందనం
బును బొడిచేసి యాజనక ♦ పుత్త్రిని నాస్థితి నిల్పియుంచి తా
నని మొన శ్రాంతినొంది జర ♦ నందుట రావణుచేతఁ జచ్చె; న
ద్దనుజుఁడు శౌర్యగర్వమున ♦ నాతని జంపెను దోర్బలంబునన్. ౧౧ 1934

క. ఆరామునిచే నట సం,స్కారమ్మును గాంచి పొగడఁ ♦ గాఁ జను ముక్తిం
గోరికఁ బొందెను నంతట, శ్రీరాముఁడు నాపితృవ్యుఁ ♦ జెలికాఁడమునన్.

క. తనవశము చేసికొని నా, జనకుండగు వాలిఁ జంపె ♦ సచివులతో భా
నునిసూనుఁడు నిరతము నా, జనకునితో వైరముఁ గొని ♦ సకలవిధములన్.

తే. కాచియుండెనుగాన రా ♦ ఘవుఁడు వాలిఁ
జంపి సుగ్రీవుఁ బ్లవగరా ♦ జ్యమునకెల్ల
నధిపతిగ నభిషేకించె ♦ నర్కజుండు
కపులరాజ్యంబు గాంచి రా ♦ ఘవునివలన. ౧౪ 1937

క. వనచరపంక్తికి రాజయి, తనరుచునున్నాఁడు మేము ♦ తనియాజ్ఞనె రా
మునికార్యమునకె యర్థ్యై, వనముఖముల నెల్ల వెదకి ♦ వదలనివ్రాన్కిన్.

క. తిరిగితిమి రాత్రి శ్వాన్కర, కరములు గనఁబడనిరీతిఁ ♦ గా జానకి మా
దురదృష్టంబునఁ గన్పడ, దరసిన; మేమెల్ల దండ ♦ కాటవిఁ బూన్కిన్. ౧౬

ఆ. తిరిగి చూచిచూచి ♦ తెలియకుండుట ధర్మ
చారిణియగు నొక్క ♦ సాధ్వి నాన్వ
యంప్రభను బిలంబు ♦ నందుఁ గనుంగొన
నందుఁ జొచ్చినార ♦ మార్యవర్య!. ౧౭ 1940

చ. తనదువిచిత్రశక్తి మయ ♦ దానవుఁ డాబిలమున్ రచించె మే
ము నచట జానకిం గనెదు ♦ మోదమునన్ వెదకంగ నంతలో
జనియెను మాన మాప్లవగ ♦ సత్తముఁ డానతియిచ్చె దేని మే
మును బ్రభునాజ్ఞఁ జేయుటకుఁ ♦ బూనినవారము గాన నిత్తఱిన్. ౧౮

తే. అతనియానతి మీాటికి యట్టివార, మగుట నాతనిసన్నిధి కరుగఁజాల
కతిభయంబునఁ జిచ్చట నంతమొంద, నాత్మ ప్రాయోపవేశ మిట్లందినాము.

తే. రామలక్ష్మణవనచర రాజులిట్లు
మాయెడం గోపమూన మేమి మాయుపాయ
మందితిమి పోవ నొక్కఁడే నచటఁ బ్రదుకఁ
జాల మీదిరి నిశ్చయంబు పక్షిరథవర్య!. ౯౯౪ 1943

ఏఁబదియేడవ సర్గము సంపూర్ణము.

---

౫౮ - వ సర్గము.

సంపాతి సీతయున్నచోటు వానరులకుఁ దెల్పుట.

క. అనియిటు ప్రాణంబులఁ బాయను సంసిద్ధముగనున్న యవ్వానరు లా
డిన దుఃఖవచనముల విని, యనుకంపను దాను దుఃఖమందిన మదితోన్.

క. పలికెను జేరెలుఁగున న,య్యలనుండి జలంబు గాఱఁ గోఁతులతో; నో
యలఘుసుతులారా! యనిమొన, బలవంతుండైన యసురవలనన్ హతుఁడై.

క. చనియెను ముక్తికి నని మీా, రనుకంప వచించినట్టి యాపక్షీంద్రుం
డనుజుండు నాకుఁ జుండీ!, దనుజుండు జటాయువును గృధ్రం జంపె ననన్.

క. వినినప్పటికిని జరచే,కను బక్షవిహీనతను నిశాంత మశక్తిం
గనినాఁడఁగాన దానిని, మనమున నోర్వంగవలసె మాటలిఁకేలా!. ౨౪ 1947

క. అనుజుని వైరవిమోక్షణ,మును జేయఁగ శక్తిలేదు; మును వృత్రవధం
బును జరిగినప్పు డిరువుర, మనుజులమగు మేము గర్వమంది చెలఁగుటన్. 3

తే. ఒండొరుల వేగశక్తుల నొగిని దెలియఁ
గోరి వేయికరంబులఁ గూరథంగిఁ
బ్రజ్వలించెడుసూర్యుని పరిసరమున
కరిగితిమి మండలాకృతి నాకసమున. ౪ 1949

క. తిరుగుచు విశేషదూరం, బరిగితి మంతటను సూర్యుఁ డతివేగమ యం
బరమధ్యగతుండౌటన్, గరము తదీయాతపమునఁ గందినయనుజున్. ౫

క. కని యతని తాపమును దీ,ర్పను దలఁచుచు భ్రాతృమైత్రిఁ బాటించితి; నా
మన మపుడు పరవశత్వముఁ, గనుటం బక్షముల నతనిఁ గప్పితిఁ బూన్కిన్.

చ. ఖరకరతీవ్రతాపమునఁ గాలెను నాదగుపక్షయుగ్మ మీా
ధరశిఖరంబునం బడితి దారుణబాధను గాంచి యంత ని
ద్ధరణి వసించుచున్ మరలఁ దమ్ముని జూడ నెఱుంగనైతి న
క్కరణిని బోవఁజాలమి వగం దురపిల్లుచు నింటె యుండితిన్. ౭ 1952

తే. గనుక సీతయె యగు నామె ♦ యని తలంతు
నింక నారాక్షసునివాస ♦ మెఱుకపఱతు
వినుఁడు రావణుఁ డనువాఁడు ♦ విశ్రవసుని
తనయుఁ డగును గుబేరుని♦తమ్ముఁ డతఁడె. ౧౮ 1960

క. నిరతం బాతఁడు లంకాపురమున వర్తించుచుండుఁ ♦ బోలఁగ వినుఁడీ!
ధరనుండియె శతయోజన, పరిమితదూరమున నబ్ధి♦భాగమునందున్. ౧౯

ఆ. ద్వీపమందు నొకటి ♦ యాపట్టునందున, నందమైన లంక♦యనుపురంబు
విశ్వకర్మ దాని ♦ వెలయించెఁ; గాంచన, వేదికలను మిగుల ♦ వెలయునట్లు.

క. కనకద్వారంబులు తగు, వనజాప్తులవలె వెలుంగు ♦ ప్రాకారము దా
నిని జుట్టియుండుఁ జక్కఁగ, వనితామణి సీత యట్టి♦పరనగరమునన్. ౨౦

తే. దనుజాంతఃపురంబున ♦ దనుజకాంత
లెల్లఁ జుట్టును గావఁగ ♦ నెవ్వరో కట్టి
వట్టివస్త్రంబుతోడ దీ♦నాస్యయగుచు
నున్నదటఁ జూడఁగలరు మీ ♦ రుర్వితనయ. ౨౧ 1964

చ. జలధియుఁ జుట్టుఁ బర్వ దను♦జప్రభుపత్తన మొప్పు గుప్తమై
యలరెడు నూఱుయోజనము ♦ లంతటిదూరమునందునున్న య
జ్జలనిధి దాఁటి దక్షిణది♦శంబగు తీరముఁ జేరి లంకలో
పలఁ జొరనట్లతే ననుర♦పాలకుఁ జూడఁగలార లచ్చటన్. ౨౨ 1965

క. త్వరగా మీరాలంకకె, యరుగుం డచ్చటికిఁ బోయి ♦ యవనిజఁ గని వే
మరలి చను దేరఁగలరని, యరసితి నేదివ్యదృష్టి ♦ నంతయు సరిగన్. ౨౩

సీ. ధాన్యములం దిని ♦ తగుబక్షులును బిచ్చుకలు భూమిపరిసర♦ములనె దివిని
మొదటిమార్గమునఁ దా♦ము తిరుగుచుండును గాకులుమఱియు*వృ♦క్షఫలములను
దిని మనుపక్షులు ♦ తివిరి దానికిపైని రెండవత్రోవఁ జ♦రించుచుండు
జలవాయసములు క్రౌం♦చమ్ములుకురరముల్ మూఁడవదౌమార్గ♦మునఁ జరించు,
శ్యేనమ్ములాపైని ♦ జెలఁగు త్రోవనఁ బోవు గ్రద్దలైదవదారిఁ ♦ గదలుచుండు
తే. బలము వీర్యంబు రూపయౌ♦వనము లలరఁ
దగినహంసలు షష్ఠప♦థంబునఁ జను
వైనతేయంబులో పక్షి♦వారము లోగి
సంచరించును సప్తమ♦సరణియందు. ౨౪ 1967

క. వినతాపుత్రులవంశం, బునఁ బుట్టినవాఁడ, వినత♦పుత్రుఁ డరుణుఁ డం
చు నెగడు వానికిఁ దనయుఁడఁ, గనుకనె సప్తమపథంబు♦గద మాకెల్లన్.

తే. ఇచటనుండియె రావణు♦నిలతనయను,♦జక్కఁగాఁ జూచుచున్నాఁడ♦సాధులార!

---

* యే చ వృక్షఫలాశనః-అని మూ.

గరుడునకుఁబలె మాకును ♦ గలవు దివ్య,దృష్టిబలములు ఘోరక♦పీంద్రులార!.

క. వినుఁడీ నైసర్గబలం,బున నాహారంబు విధ్య♦మున నరశతయో
జనముల దూరమునఁ జిక్కన్, జను దృష్టిబలంబు మాకు ♦ సతతముఁ దనరన్.

తే. చరణమూలములను నేర ♦ సంగ్రహించు
వృత్తివిధిచేత విహితమై ♦ వెలయునట్లు
దూరదేశంబులందు నా♦హారము సంగ్ర
హించునట్లును మాకు వి♦హితము నుండె. ౩౧ 1971

చ. అతిశయనీచకర్మముల ♦ నర్థములంచు నొనర్చినట్టి యా
దితిసుతు రాఘవుం డనిని ♦ తీక్ష్ణశరంబులఁ ద్రుంచునేని నేఁ
బ్రతికృతి నాసహోదరుని ♦ రావణుఁ డిట్లగిఁ జంపినందుకై
హితముగఁ జేసినట్లై యగు ♦ నిప్పుని మీర లొనర్పఁగాఁ దగున్. ౩౨ 1972

తే. ఏదియేని యుపాయంబు ♦ నిప్పుడు లవణ
సాగరంబును దాఁట మీ♦స్వాంతములను
దలఁపుఁడీ మీరు జనకత♦నను గనుఁగొని
యిష్టసిద్ధిని గని పురి♦ కేగఁగలరు. ౩౩ 1973

క. సురపురి కేగిన, తేజ,స్స్ఫురణంబునఁ బొల్చునట్టి♦సోదరుండగు సో
దరునకుఁ దర్పణ మొసఁగుదు, శరనిధిచెంతకును జేర్పఁ♦జను నను మీరల్.

ఆ. శౌర్యధుర్యులైన ♦ సకలవానరులంత, దగ్ధపక్షుఁడయి క♦దలనునేర
కున్న గృధ్రరాజు ♦ నుదధిచెంతకుఁ జేర్చి, యతఁడు తర్పణంబు ♦ లాచరింప.

తే. మరల నెప్పటిచోటికి ♦ మమతఁ జేర్చి,
జనకతనయయు దుష్టుఁడౌ ♦ దనుజుఁ డున్న
స్థలము తమకును దెలుపుట♦వలనఁ బరమ
హృష్టులయి కార్యసిద్ధి య♦య్యె ననుకొనిరి. ౩౬ 1976

ఏఁబదియెనిమిదవ సర్గము సంపూర్ణము.

---

## ౫౯ - వ సర్గము.

* సంపాతి జాంబవంతునితో సీతవార్తను దానెఱింగిన విధముఁ జెప్పుట.

క. వనచరు లమృతాస్వాదం,బును బోలిన యతనివాక్య♦మును విని దేహా
ళినిరోమాంచములొప్పఁగ, ఘనహర్షము నొంది; రంతఁ♦గడుఁబూన్కితగన్. ౧

---

* ఈసర్గము మొదలైదుసర్గములు ప్రక్షిప్తములు. ఈవిషయమున గోవిందరాజులు "తత స్తదమృతాస్వాద మిత్యారభ్య పంచసర్గాః ప్రక్షిప్తాః సర్వకోశేష్వదర్శనాత్. తాన్యేవాపి కథాసంఘట్టనాత్ పూర్వోక్తార్థవిరోధస్ఫోరకత్వాచ్చ. తథాపి తే వ్యాఖ్యాయంతే" అని వ్రాసిరి. కాన నీయైదుసర్గములు కథాబాధకములు గావని వ్యాఖ్యాతృవళి ప్రాయముగాన వీనిం దెనుఁగొనర్చితిమని పాఠకులకుఁ దెలుపుకొనుచున్నాము.

సీ. వనచరేశ్వరుఁడు జాంబ♦వంతుఁడు కపులును దానును వేగంబ ♦ ధరణినుండి
లేచి యాసంపాతిఁ ♦ జూచి యిట్లనియెఁ; జెందునున్నది సీత ♦ యెవ్వఁ డామె
నపహరించెను! నామె♦యరయుచుండంగ నెవ్వఁడు మాచెమా♦కెఱుఁగఁ జెప్పుము
వనచరులకు గతి ♦ యగు నీవె పక్షీంద్ర! వజ్రవేగంబునఁ ♦ బైని బడెడు
ఆ. రాముబాణములను ♦ రాజత్సుమిత్రాత్మ, జప్రయుక్తబాణ♦సాంద్రవిక్ర
మము నెఱుంగలేక ♦ యమితసారత నెవ్వఁ, డున్నవాఁ డనంగ♦నూహ చెలఁగ.

చ. జనకజవార్తనే యెఱుఁగఁ ♦ జాలప్రియంబును శ్రద్ధనుంచి త
న్గనుచును బ్రశ్న సేయు కపి♦కాంతులఁ బల్కులు నాలకించి యి
ట్లనియెను గృధ్రనాథుఁ డెటు ♦ లాజనకాత్మజ రావణుండు వం
చనఁ గొనిపోవఁగా వినఁగఁ ♦ జాలితినో యెఱఁ గద్ది చెప్పెనో. ౭౯ 1979
తే. ఇప్పు డాజనకాత్మజ♦యెందునున్న,దో యెఱింగించువాఁడ మీ♦రొగి వినుండు;
చాల యోజనవిస్తృతి♦గ్రాల దుర్గ,మముగ నున్నట్టి యుప్పర్వ♦తమున నేను. ౮౦
క. పడి చాలకాలముగఁ బె, న్పడలిన శౌర్యాసువులను ♦ బలమెడలంగాఁ
గడువృద్ధుఁడనై తిని నేఁ, బడుచున్న యవస్థఁ గాంచి ♦ పతగతిలకుఁడై. ౮౧ 1981
క. తనరెడు సుపార్శ్వుఁడను నా, తనయుం డాహారములను ♦ దఱితప్పక నా
కు నొసంగుచుఁ బోషించుచుఁ, గనుచుండును నన్ను; వినుఁడు♦గంధర్వులకున్.
తే. కామ మతితీక్ష్ణమగు, భుజం♦గములకెల్లఁ
గోప మతితీక్ష్ణముగఁ జెలం♦గును, మృగముల
కగును నెప్పుడు తీక్ష్ణభ♦యంబు, మాకు
క్షుత్తు మిగులంగఁ దీక్ష్ణమ♦గును సతంబు. ౮౩ 1983
సీ. ఒకనాఁడు క్షుత్తు న♦న్నొకరీతి బాధింప నాహారమును గోరి ♦ యధికమైన
యాశతో నేనుండ ♦ నర్కుఁడు క్రుంగినతరువాత మాంస మిం♦తయును లేక
తనయుండు నాచెంత♦కును వచ్చె నేను క్షుద్బాధయు దప్పియు ♦ బడలువఱుప
వృద్ధభావంబున ♦ నెక్కువకోపంబు గదురుటఁ గొమరుని ♦ గసరినాఁడ;
తే. నతఁడు నాకెప్డు మోదంబు ♦ నధికమావి
ధంబునన్ సంచరించు నా♦ధైర్య మరసి
యాఁకలికి నోర్వలేకుంట ♦ నవుడెఱింగి
కుపితుఁ డగునన్నుఁ బ్రార్థించి ♦ కోప ముడిపి. ౮౪ 1984
క. తనవృత్తాంతం బంతయు, ననుమానము లేకయున్న♦యట్లెఱిఁగించెన్
వినుఁ డామాటలఁ దెలిపెద,నను నాయన!యంచుఁ బిలిచి ♦ నయముగఁ బలికెన్.
చ. అనిశము పోవునట్లె నమ♦యం బొకయింతయుఁ దప్పకుండ నేఁ
జని వినువీధి నీకెరను ♦ జాలఁగఁ దే మదిఁ గోరి నత్వరం
బున నె మహేంద్రపర్వతము ♦ పొంతకుఁ బోయితి దానిద్వార మొ
య్యనఁ గని యావరించి తగు♦నామిషముం గొనవెంచి యుంటిఁ జూ! ౮౬

క. జలనిధిసహస్రసంఖ్యల, గోలఁదిని జరియించు జంతు♦కూటంబుల ని
ష్ఠులఁ బట్టఁగ నేనొకఁడనె, తలవంచి తదీయమాంస♦ఖండంబునఁ బూన్కిన్.

క. అరికట్టి యుంటి; నచ్చట, విరిసిన యంజనచయంబు♦విధమునఁ గాంతుల్
పరఁగంగ నెవ్వఁడో భాస్కరునుదయము వోలె వెలయు♦సాధ్వీకౌతుకన్.

క. గొనిపోవుచుండఁ జూచితి;, విను మే నాహారకాంక్ష ♦ వెలయఁగనుంటం
గనుకనె యాయిష్వరనుం, గనినంతనె వారిఁ బట్టఁ♦గా మదిలోనన్. ౧౬॥

[1]ఆ. నిశ్చయించుకొంటి ♦ నేనంత నాతఁడు, సవినయముగ నన్ను ♦ సామవచన
ములను బల్కి మార్గ♦మును విడువందగు, ననుచు వేఁడె నెయ్య♦ముల గుసట్లు.

క. హితవచనంబుల వేఁడెడు, నతనిన్ ధర నెవరుగాని ♦ యరయక కొట్టన్
మతిఁ దలఁపరుగద నీచత, క్షితిఁ దగువారలును గూడఁ ♦ జేయరు గాదే!.

తే. ఇంక నావంటివాఁ డట్టు♦లేల చేయుఁ
బురుషుఁ డాతఁడు తన తేజ♦మునఁ బొలుచుచు
నాకసముఁ గ్రిందుపఱుపంగ ♦ నాత్మఁ దలఁచి
నట్టు లంబరమునఁ బాఱె ♦ నంతనన్ను. ౧౮ 1992

క. సురపథమునఁ దిరిగెడునా, వరభూతములెల్ల నెలమి ♦ వచ్చి పలుకులం
గరుణఁదగ గారవించెను, బరమర్షులు నన్నుఁ జూచి ♦ వత్సా! యనుచున్.

తే. పలికి రిట్లని విధిగతి ♦ బ్రదికితీవు
దనుజుఁ డీతఁ డదెట్టులో ♦ తరుణితోడఁ
జనియెఁ గావున శ్వశ్రేయ♦సంబు నీకు
నయ్యె నిస్సంశయంబంచు ♦ నంతలోన. ౧౯ 1994

సీ. పరమశోభనములఁ ♦ బరఁగు సిద్ధులు చెప్ప నతఁడు దానవులకు ♦ నధిపతియగు
రావణుండని యాభ♦రణములు ధరఁబడఁ గౌశేయమును జాఱఁ♦గా వెతలను
గుందుచు, మృదువులౌ ♦ కురులును విరియంగ రామలక్ష్మణులను♦నామములను
బలుమాఱు తలఁచుచుఁ ♦ గలఁగుచు నేడ్చుచు నున్నయాబిడ జన♦కోర్వీపతికిఁ

తే. దనయయును రామచంద్రుని♦తరుణియునగు
సీతయనియును వాఁ డామెఁ ♦ జెఱఁగొని చను
చున్నవాఁడని యెఱిఁగితి ♦ నోమహాత్మ!
ప్రొద్దు వోవుట కగు హేతు ♦ విద్ది సుమ్ము!. ౨౦॥ 1995

[2]క. అని కాలవిదుత్తముఁడగు, తనయుండు సుపార్శ్వుఁ డివ్వి♦ధం బంతయు నా
కు నెఱుంగఁ జెప్పె నీవిధ,మును విన్నను రాముివిషయ♦మున నాబలమున్.

క. కనఁబఱుప బుద్ధిపొడమదు, వినుఁ డేఁ బతగంబ నగుట ♦ విఫలదళములే

1 తేన సామ్నా విసృతేన పంథాన మభియాచితః-అనిమూ. 2 ఏవకాలాత్యయ స్త్వాం దితి కాలవిదాం వరః-అనిమూ.

ఘనబలము నాకుఁ గావునఁ, బని యది లేకుండఁజేయ♦వల నెట్టులనగన్.

క. ముక్కును బుద్ధియు నిష్ఫలము, చక్కని గుణవంతములగుఁ ♦ జాలుదు వానిన్
మిక్కిలి సాయమొసర్పఁగ, నెక్కరణిని దానిఁ జేయ♦నేర్తునొ యిచటన్.

తే. అవ్విధంబు వచించెద ♦ నద్ది వినుచు
దానికిని మీపరాక్రమ♦మౌను బలము
గాని దానిన పనిఁదీర్ప ♦ గావలయును
వాఙ్మతులచేత సాయంబు ♦ వలసినంత. ౧౯ 1999

క. ఒనరుతు మీకంకఁటికును, మనరాముని కార్యమెల్ల ♦ మాయదియే దీ
నను సంశయంబు గలదే, వనచరనాయకులఁ మీమ్ము ♦ బలశౌర్యములన్.

క. సురలకు నెదిరింపంగాఁ, దరంబుగానట్టివారిఁ ♦ దశబుద్ధిబల
స్ఫురణమున నొప్పువారిని, నరణ్యముల వెదకఁబంపె ♦ నరసియె మిమ్మున్.

తే. వాడులై కంకపత్రాళి ♦ వఱలుచున్న
రామలక్ష్మణబాణముల్ ♦ రయముమీఱ
ముజ్జగంబుల రక్షింప ♦ ముంపఁజాలు
దనుజపతి రావణుఁడు తేజ♦మున బలమున. ౨౭౪ 2002

చ. చెలఁగుచునున్న మీరలు ప్ర♦సిద్ధపరాక్రమయుక్తులౌట మీ
కిలపయిఁ దీర్పరానిపని ♦ యేదియు లే దటుగాన మీర లు
జ్జ్వలమతులయ్యుఁ గాలమును ♦ వైపయి స్వార్థము చేయరాదు ని
స్తులమతులౌ భవాదృశులు ♦ సూరులు కార్యము సంఘటిల్లఁగా
నలనులు వోలె నుంకక బ♦లాధికులై పనిఁ దీర్తురేకదా!. ౨౯౪ 2003

ఏఁబదితొమ్మిదవ సర్గము సంపూర్ణము.

---

## ౬౦ - వ సర్గము

—సంపాతి తనవృత్తాంతమును వానరులకుం జెప్పుట.—

క. అనుజునకు నుదకదానం,బును నొనరిచి జలములందు ♦ మునిఁగిన సంపా
తిని హరియూథపు లాదర,మునఁ బరివేష్టించియుండఁ ♦ బొల్చెదువాంఛన్.

క. హరివరులతోడ తనదౌ, పరిసరమునఁ గూరుచున్న♦వాలితనూజున్
బరమాదృతిఁ గని గృధ్రే,శ్వరుఁ డిట్లనిపల్కె మాని ♦ వచనమురీతిన్. ౧౪

చ. వనచరదర్శనంబు తన♦వాంఛలఁ దీరుపఁజాలునన్న నె
మ్మనమునఁ గల్గు నమ్మికను ♦ మాన్యుల వారలఁ గాంచి యోమహా
వనచరులార! హెచ్చరిక ♦ బాగుగ మీకు వినుండు నద్దునే
యను జన దేను నెవ్విధి ని♦లాత్మజవార్త నెఱింగినాఁడనో. ౨౪ 2006

తే. దానిఁజెప్పెద నే యథా♦ర్థముగ మీకు, నర్కురశ్ముల చేత నా♦యవయవంబు

తెల్లఁ దపియింపఁగా సొమ్మ♦సిల్లి యిచట,వింధ్యశిఖరమ్మునం దను♦విపినమందు.
క. పెనువగలఁ బడితి; పక్షశ, లను దెల్వొంబొంది విహ్వ♦లతఁ గని మూర్ఛం
గనునట్లు పరవశుఁడనై, గనినాఁడను నాల్గుదెసలఁ ♦ గానిమహాద్రిన్. ౮౹
క. దుదపిల్లుట నేభాగమొ, ధరయిది యని సుంతయేని ♦ తలంపఁగలేక
త్తరుణమునుండి యంతట, పరిత్వరిని ద త్తటస్థ♦శైలాటవులన్. ౯౹ 2009
క. సరసుల నదులను నుఱి నా,గరతీరముఁ గాంచి యిదియె♦గాయని తెల్వొం
బొరసితి; నిది దక్షిణసా,గరతీరమునందుఁ బక్షి♦గణసంకులమై. ౧౦౹ 2010
ఆ. పెనుగుహాంతరములు ♦ తనరార శిఖరంబు
లలర వెలయు వింధ్య♦మని యెఱింగి
నిశ్చయించినాఁడ; ♦ నిర్జరపూజిత
మగుచుఁ బావనమగు♦నాశ్రమ మిది. ౧౧౹ 2011
[1]క. కనఁబడె నుగ్రంబగు తపమును జేయు నిశాకరుఁ డను♦ముని యొకఁ డుండెన్
వినుఁడో ధర్మమతిం గనుఁ,గొనఁజాలిని కేశులార! ♦ కూటమున నిటన్. ౧౨౹
సీ. ఆముని మరణంబు ♦ నందినతరువాత నొక్కఁడనే యిందు ♦ నున్నవాఁడ
నష్టసహస్రసం♦ఖ్యాబ్దములయ్యె నప్పటినుండి; యంతనే ♦ పరమకష్ట
ములఁబొంది [2]వ్యత్యస్త♦ముగ నున్న వింధ్యశిఖరమునుండి యెమ్మెల్లఁ ♦గాదిగియట
వాడిచివరలర♦ర్భలుగల యాశ్రమధరణికి వచ్చితి ♦ మరల వెతల;
తే.నట్లు దుఃఖతుఁడనునయి ♦ యప్పు డతనిఁ
జూడఁగాఁ గోరితిని ముని♦సురపతి మును
తమ్ముఁడును నేను బలుమాఱు ♦ దర్శనంబు
చేసి సేవించుచుందుము ♦ చిత్తములర. ౧౩ 2013
చ. మునిపతి యాశ్రమంబునకు ♦ మోదము మీఱఁగ వచ్చినంతఁ జ
జ్వలితవగు వాసనల్ పొలయఁ♦గాఁ బవమానుఁడు వీచె నందుఁ బు
ష్పనికరహీనమైన విట♦పం బొకఁడైనను లేదు పండ్లచే
ననిశము గ్రాలుచుండును మ♦హాతరువుల్ కనువిందుచేయుచున్. ౧౪ 2014
క. మునినాథుపావనాశ్రమ,మును జేరి మహీజమూల♦మునఁ గ్రిందను స
మ్మునిఁ జూడఁ గోరియుంటిని;, వినుఁ డంతట నతఁడు స్నాన♦విధి సల్పి తగన్.
ఆ. జ్వలితతేజుఁడగుచుఁ ♦ జయ్యన నుత్తర, దిక్కు మోము గాఁగఁ ♦ దేరిచూడ
నలవిగాక చెంత ♦ కరుదేరఁ జూచితి;, బ్రహ్మఁగొలుచు ప్రాణి♦పటల మట్లు. ౧౬
సీ. భల్లూకములు కరుల్ ♦వ్యాఘ్రసింహంబులు చమరంబులును మహా♦సర్పములును
బలసిచుట్టును మహానిఁ♦గొలిచియుండు నుజుఁడే! నరనాథుఁడొగినంతి♦పురముఁ జేర

1 వసతో మమ ధర్మజ్ఞా స్వర్గతే తు నిశాకరే-అనిమూ. 2 కృచ్ఛ్రేణ విషమాచ్ఛైలా-
అనిమూ.

నచివాదులెల్లరు ♦ చనునట్లు మునిపతి యాశ్రమాంతరమున ♦ కరుగ నవల
నాజంతునంతత ♦ యరిగె నక్షత్రములు; నస్తమాద్రి యం ౙ్రీతి ♦ యబర నన్నుఁ

ఆ. గాంచి లోనికేగి ♦ యించుకసేపటి, కరుగుదెంచి నెలికి ♦ యడిగెఁ గార్య
మేమటంచు నన్ను; ♦ నీరీతి నుతియును, బలికె నీదువెంబ్రు ♦ కలు కమలుట.

క. నీరూపు తెలియకున్నది, నీరెండు నఖంబు లగ్ని ♦ నెఱిఁ గాలినవే
భూరిపతగేంద్ర! చర్మము, నారయఁగా వ్రణిత మగుచు ♦ నందము తప్పెన్.

చ. మును గనినాఁడ గృధ్రగణ♦ముఖ్యములై పవమాన వేగముం
గని మఱి కామరూపములఁ ♦ గాంచినసోదరులన్ బతత్త్రులన్
గనుఁగొన నందు జ్యేష్ఠుఁడవు ♦ గావె మహాత్మక? యాజటాయువో
యనుజుఁడు గాఁడె నీకు నను♦జాంగములం గొని మీఱి లిద్దఱున్. ౧౯

క. ననుఁ గని నాపాదములకు, ననూనవిధివందనముల ♦ నలరింతురుగా
విను నీకు వ్యాధిగల్గెనె, తనువున నేదేని నీదు♦తతపక్షంబుల్. ౨౦ 2020

తే. ఎట్లు పడిపోయె నిన్నిటు ♦ లెవ్వరైన
శిక్షచేసిరె? సర్వంబు ♦ చెవుమ' నాకు
నున్న దున్నట్లు సంపాతి ♦ యన్నుఁడవయి
యిట్టు లుండంగనేల? నే♦నెఱుఁగఁ దలఁతు. ౨౧ 2021

అఱువదియవ సర్గము సంపూర్ణము.

---

౬౧ - వ సర్గము.

సంపాతి తనవృత్తాంతమును నిశాకరమునికిఁ జెప్పుట.

చ. అనవిని దుష్కరంబయి భ♦యంకరమై పెనుసాహసంబుచే
నొనరుపనైన నాచరిత ♦ నుగ్రమయూఖుని వెంబడించి పో
యినయది యాదిగాఁ దెలిసి ♦ యే నొనరించిన కార్య మమ్మహా
ముని కెఱిఁగింపఁబూనితిఁ; బ్ర♦మోదము మీఱఁగ నిట్లు పల్కితిన్. ౧ 2022

సీ. పక్షయుక్తము గాలి ♦ వ్రణయుక్తమై తనువుండుట సిగ్గుచే ♦ నొక్కరీతి
నింద్రియాళి కలంగి ♦ యొట్టులో యుండుట శ్రమమున మనసు ని♦స్సారమగుటఁ
బ్రత్యుత్తరమును జె♦ప్పంగ లేకున్నాఁడ దర్పంబునన్, మేము ♦ తనువు లెఱుఁగ
కొండొరులపరాక్ర♦మోద్ధతుల్ తెలియంగఁగాంక్షించియొకటనా♦కాశమునకు

తే. నెగిరినాము జటాయువు ♦ నేను వీర్య
మలరఁ; గైలాసశిఖరంబు♦నందు మునుల
పరిసరంబున "రవియ స్త♦పర్వతమున
కరుగు నంతదనుక మన ♦ మతనివెంట. ౩౫ 2023

క. చనఁదగునని" పణ మిడుకొని, యనుజుండును నేను నొకట ♦ నంబరమునకున్

ఘనజవము మీఱ నెగిరితి, మనఘా! యపు డవనిఁగల్గు ♦ నఖిలనగరముల్.

*క. అరదముచక్రమునట్టులు, పరికింపఁగనయ్యె మాకు ♦ బహుభంగుల; నం
తరమునఁ గొన్నిస్థలంబులఁ, బరఁగెడు వాద్యధ్వనులను ♦ బ్రహ్మధ్వనులన్.

క. వినినార; మరుణచేలం,బును దాల్చి యుదాత్తగాన♦మును జేసెడు నిం
దునిభాననలం గొంచఱఁ, గనినారము; మేము నంతఁ ♦ గడు శీఘ్రమునన్.

చ. సురపథమందుఁ బోయి యట ♦ సూర్యునిమార్గముఁ జేరి క్రిందిదా
ధరణిని జూడ మావనము ♦ తద్దయుఁ బచ్చికపట్టు రీతిగాఁ
బరఁగుటఁ గాంచినార, మిలఁ ♦ బర్వతపంక్తులు చిన్నవైన ప్ర
స్తరములభంగిఁ గానఁబడె ♦ త్స్థానలిఁ బాఱు నదుల్ నితాంతమున్. ౭౪

తే దారములరీతిఁ గన్పడె ♦ మేరువింధ్య
హిమగిరుల్ మడుగుననున్న ♦ యేనుఁగులవి
ధంబునం గానఁబడినవి; ♦ తత్పథమునఁ
దిరుగుచుండినయప్పు డో♦ధరణిదివిజ!. ౯ 2028

క. అతితీవ్రస్వేదము మా, కతిఖేదముగల్గె మఱి భ♦యంబును బాడమెన్
మతివిభ్రాంతియు నతులల, కతిశయతమ మల్లె గల్గు ♦ టాసమయమునన్. ౧౦

ఆ. భయదమైన మూర్ఛ♦వచ్చెను నిది యామ్య
మిద్ది పశ్చిమమగు ♦ నిదియె యగ్ని
దా విదిక్కనియును ♦ నాత్మలకుం దోఁప
కుండె నియతమగుచు ♦ నొప్పుజగము. ౧౦౪ 2030

క. అనలునిచేఁ గాల్పఁగఁబడి, తనరూప మడంగి ప్రళయ♦తరుణంబున నుం
డినరీతిఁ గానఁబడె నా, మన మప్డు కలంగి మాని♦మండన యంతన్. ౧౧౪

తే. చూడ నాధారమైన చ♦క్షుస్సునుండి
వదలి నశియించినట్లయ్యె ♦ వరుస దృష్టి
శక్తియును సన్నగిల్లె నే♦సాంద్రయత్న
మునను జక్షుస్సులన్ మన♦స్సునను గూర్చి. ౧౨ 2032

క. కనుఁగొంటి రవిని శ్రమమున, మునివర్యా! మాకు భాను♦మూర్తియపుడు పృ
థ్వినిఁబోలి ప్రమాణంబునఁ, గనఁబడియె; జటాయువంతఁ ♦ గడుబడలికచేన్.

క. నాతోడం జెప్పకయే, యాతఁడు నాకసమునుండి ♦ యవనింబడఁగా
నాతమ్ముఁ డట్లు పడుటను, జేతోదుఃఖమునఁ గాంచి ♦ శీఘ్రమ నేనున్. ౧౮

క. తనువుం బడవిడిచితిని గ,గనంబునుండియె మునీంద్ర! ♦ గాదిలియనుజు
న్మని నేను బక్షయుగ్మం,బునఁ గప్పుటఁ గాలకుండెఁ ♦ బూషునిదీప్తిన్. ౧౮౪

* రథచక్రప్రమాణాని నగరాణి పృథక్పృథక్-అనిమా.

తే. ఆకసమునుండి పడునప్పు ♦ డార్య! నేను
గాలిచేఁ బ్రమాదమున నాదు♦గాదిలి యను
జన్ముఁ డాధరఁ బడు జన♦స్థానమందుఁ
బడినవాఁడని తలఁచెద ♦ స్వాంతమందు. ౧౫ 2036

తే. దగ్ధపక్షుఁడనై నేను ♦ ధారణీధ్ర
మందు నీవింధ్యమునను మూ♦ర్ఛాతురమునఁ
బడితి; ఱెక్కలు గాలె నా♦ భ్రాత లేఁడు
చెంత రాజ్యశౌర్యంబులు ♦ చెడియెఁ గాన. ౧౬ 2037

క. తనువునఁ బ్రాణము లిడుకొని, మనఁజాలను గోర్కిగలదు ♦ మరణమునొందం
గను గాన వింధ్యశిఖరం, బుననుండియెః పడుదు మృతిని ♦ బొందెద దానన్.

అఱువదియొకటవ సర్గము సంపూర్ణము.

---

౬౨ - వ సర్గము.

-- నిశాకరముని సంపాతికి ఱెక్కలు వచ్చురీతి నెఱంగించుట. --

క. అని నే నమ్మునిపతితోఁ, మనవి యొనర్చుచును దుఃఖ♦మగ్నుఁడనై రో
దన మొనరించితి నంతట, మునిపతి యొకక్షణము ధ్యాన♦మున నుండి తగన్.

*క. ననుఁ గాంచి యిట్లు పలికెన్, వినుమా! చతుర్బలములు ♦ విక్రమమును బ్రా
ణనిచయమును బక్షంబులు, తెనకారు ప్రపక్షములును ♦ తమకై తా రే. ౧

తే. మరలఁ గ్రొత్తగఁ గల్గు నే♦మాడ్కి మున్ను
వెలయునో యట్లె మును నేను ♦ వింటి భావి
కాలమున గొప్పకార్యంబు ♦ గలుగుననుచు
దానిఁ దపమున నెఱిఁగితి ♦ మాననీయ!. ౨ 2041

క. మునివరులవలన వింటిని, వినుమా! యిక్ష్వాకునృపతి♦వీరునివంశం
బున దశరథుండు నా నొక, మనుజేంద్రుఁడు గలఁడు తత్క్ష్♦మాపతి కింకన్.

క. ఘనతేజుఁడు రాముండను, తనయుండు జనింపఁగలఁడు ♦ తండ్రి పనుపఁగా
ననుజునితోడ నరణ్యం, బున కాఋతవిక్రముండు ♦ ముదమున నరుగున్. ౩

క. సురదానవులకుఁ జంపఁగఁ, దరంబు గానట్టిఁడైన ♦ దనుజేంద్రుఁడు ను
ర్వర రావణుండు నా నిర్భరశౌర్యంబునను మిగులు♦వాఁ డవినీతిన్ ౪ 2044

సీ. ఆజనస్థానంబు♦నందు రాఘవుఁ డుండునపుడు తత్పత్నిఁ దా ♦ నపహరింపఁ
గలఁడు యశస్విని ♦ లలితశీలయునైన నానావిధ భక్ష్యభో♦జ్యముల భోగ
సాధనంబులఁ దన్ను ♦ నమధికాశను వాఁడు పొందింపఁజూచిన ♦ భూరిదుఃఖ
మగ్నయౌటను నెంత♦మాత్ర మవ్వానిని ననుభవింపకయుండు; ♦నద్ది యెఱిఁగి

---

* పక్షౌచ తే ప్రపక్షౌ చ-అనిమూ.

తే. యింద్రుఁ డాకృతి దివ్యాన్న ♦ మీఁగలందు
జనకతనయయు సుధఁబోలి ♦ సకలసురుల
కైన లభియింపరాని ది♦వ్యాన్న మద్ది
పుచ్చుకొని యింద్రుఁ డోసఁగుట ♦ బుద్ధి నెఱిఁగి. ౮½ 2045

చ. తరుణియు నగ్రభాగమును ♦ దానటఁ గైకొని నాకు నాథుఁడై
ధరణివిభుండునైన గుణ♦ధాముఁడు రాముఁడు నామఱంది ను
ర్వరమనియుండి లేనియు ధ♦రాస్థలివీడి సురత్వమొందియు
న్నరమణ నన్న మద్ది క్షితి♦నాథుల వారలఁ జెందెనుగ్ దగన్. ౯½ 2046

చ. అని వచియించి భూమిపయి ♦ నన్నము వైచును భక్తిమీఱ; నం
త నచట రాఘవుం డనుప ♦ ధాత్రిసుతన్ వెదకంగఁ బూన్కితో
వనచరులెల్ల రాఁగలరు ♦ వారల కీవును రామపత్నివా
ర్తను దెలుపంగఁ గావలయు; ♦ స్థానము దీనిని మార్పఁబోకుమీ!. ౧౧

తే. పక్షహీనుండవౌట నె♦వ్వరుసఁ బోనఁ
గలవు దేశకాలంబుల ♦ గణనసేసి
కొనుచు నీవిందె యుండుము ♦ కోర్కితీఱఁ
బక్షములు పుట్టఁగలవు భ♦వ్యంబు లగుచు. ౧౨ 2048

క. వినుమో సంపాతీ! నీకును బక్షము లిపుడె మరలఁ ♦ గ్రొత్తవియై వ
చ్చునటులు సేయఁగఁగోరను, మనమున నదియేల యనిన ♦ మహి నీవిచటన్.

తే. ఉందు వేనియు జగముల ♦ కొక్కరీతి
హితము సలుపంగఁగలవు ♦ పృ♦థ్వీశతనయు
లైన యారాఘవులపని ♦ యరయ నీకు
మాత్రమేకాదు సుమ్ము బ్రా♦హ్మణులకెల్ల. ౧౩½ 2050

క. సురలకు మునులకు నిర్జర, వరునకు ముఖ్యముగఁ జేయ♦వలసినదా; సో
దరులగు నారాఘవులను, బరికింపఁగ నాకుఁగలదు ♦ వాంఛ మనమునన్.

క. చిరకాలము ప్రాణంబుల, ధరియింపఁగ నిచ్ఛ లేదు ♦ దానన్ దనువున్
ద్వరపడి విడిచెదనని ముని,వరుఁ డాతఁడు తత్త్వవేత్త ♦ పలికెన్ నాతోన్.

అఱువదిరెండవ సర్గము సంపూర్ణము.

---

## ౬౩ - వ సర్గము.

సంపాతి పక్షములు రాఁగా వానరులకుఁ గర్తవ్యముఁ జెప్పిపోవుట.

తే. వాగ్విదులలోన వస్యుఁడౌ ♦ బ్రహ్మమాని
యివ్విమొదలగువాక్యంబు ♦ లెన్నొ పలికి

నన్నుఁ బొగడి యనుజ్ఞను ♦ నాకొసంగి
తాఁ బ్రవేశించెఁ దనతప♦స్స్థాన మంత. 2053

సీ. పర్వతగుహనుండి ♦ ప్రాఁకి నేమెల్లఁగ నీవింధ్యపర్వత ♦ మెక్కి మీర
లెవ్వు రెవత్తురో! యని ♦ యెదురుచూచుచునుంటి, మునివరుమాటల ♦ మనసునందుఁ
బదిలంబుగా నిల్పి ♦ వనచరులార! నే దేశకాలంబుల ♦ దెలియఁగుఁ గనుచు
నిందుగా నూఱేండ్లు ♦ నెఱిఁ గడిపితి నిట నానిశాకరముని ♦ యంతఁ దాను
బరమభక్తిని మహా♦ప్రస్థానమున కేగి స్వర్గంబు నొందె లో♦పల నె నేను

తే. బహువిధవితర్కముల మదిఁ ♦ బన్నుకొనుచు
సంశయము నొంది సంతాప♦జాలములను
గ్రాఁగుచుంటిని; మృతినొందఁ♦గా మనంబు
గలిగినపుడెల్ల మునివాక్య♦ములఁ దలంచి. ౩॥ 2054

క. మరణము నొందెదుబుద్ధిని, దహరగా విడనాడుచుందుఁ; ♦ బక్షంబులు నీ
వరబలము వచ్చునని నే, మరణమ్మును బొందకుండ ♦ మానివిభుఁ డటన్. ౪

తే. నాకుఁ గల్పించినట్టి ప్రా♦ణములవంటి
యాశ దీప్తాగ్ని తమముల ♦ నణఁచునట్లు
నాదుదుఃఖమ్ము నెల్ల న♦ణఁచుచునుండు;
దుష్టమతియగు రావణు ♦ దోర్బలములు. ౫ 2056

క. నాకుం దెలిసినవైనను, నాకొమరునిఁ జూచి నే జ♦నకజను దనుజుం
బోకార్చి కావ కిట నీ, వేకరణిన్ వచ్చితివని ♦ యెన్నొవిధములన్. ౬॥

క. అదలించితి నాజనకను, తదుఃఖమును వినియు నన్న♦దమ్ము లిరువురున్
ముదిత విడనాడి యుండుట, యుఁ దగ నెఱింగియును దశర♦థోర్వీపతివై. ౭

ఆ. స్నేహమునిచి సాధ్వి ♦ సీతను విడిపించి, నాకుఁ బ్రియముచేయ♦నాకుమారుఁ
డవుడు నేఁడ దయ్యె ♦ నని గృధ్రపతి వన, చరులతోడఁ బల్కు♦సమయమందు.

ఉ. వారలు చూచుచుండఁగనె ♦ వచ్చెను ఱెక్కలు తొంటిరీతి నా
ధారణిదేవువాక్యమువి♦ధంబున నెఱ్ఱనియీఁక లొప్పఁగాఁ
జారుపక్షముల్ గలుగ ♦ సంతసమెంతయు నొంది గృధ్రభూ
దారుఁడు వానరాళిఁ గని ♦ తా నవు డిట్లని పల్కె వేడుకన్. ౯॥ 2060

క. అమితప్రభావుఁడౌ సం, యమిమహిమను మరల నాకు ♦ నర్కనికరద
గ్ధములైన పక్షములు వ, చ్చె మహాసంతోష మేను ♦ జెందెదురీతిన్. ౧౦॥

సీ. వయసున నేనున్న♦యప్పుడు నాకెట్టి బలపరాక్రమములు ♦ పౌరుషంబు
తనరారుచుండెనో ♦ తద్రీతి నయ్యవి కల్గియున్నవి కపి♦కాంతులార
యిప్పుడు సర్వథా ♦ తప్పక యత్నంబు నొనరింపుఁడీ మీర ♦ లుర్వీతనయఁ
గనుఁగొనఁగలరు ఱె♦క్కలు నాకు వచ్చెను గార్యసిద్ధియుఁ గల్గ♦గలదటంచుఁ

తే. బ్రత్యయమ్మును బుట్టించెఁ; ♦ బరఁగ నిద్ది
యనుచుఁ బక్షీంద్రుఁ డప్పుడా♦వనచరుండు
గాంచి వచియించి యంతరి♦క్షమునఁ దిరుగఁ
దనదు నూతనపక్షస♦త్త్వం బదెంతొ. ౧౨॥ 2062

క. తెలియంగఁ గోరి యంబర, తలమున కెగిరెను మహీధ్ర♦తలమును విడి యి
మ్ముల నిట్లు గృధ్రనాథుఁడు, పలికిన విని పక్షయుగముఁ ♦ బరికించి తగన్.

తే. అతులసంతోషమును బొంది ♦ యపుడు పౌరు
షమును జూపుచు రాముని ♦ సాధ్విఁ గనెడు
నభ్యుదయకార్యమును బొంద ♦ యత్న మపుడె
చేయఁ దలఁచిరి వానరుల్ ♦ చిత్తములను. ౧౪॥ 2064

*చ. అనిలసమానవేగమును ♦ నందినవానరవీరులెల్ల నొ
య్యన ఘనవిక్రమంబుఁ గొని ♦ యాజనకాత్మజఁ జూడఁగోరి చ
క్కనియభిజిన్ముహూర్తమును ♦ గానఁగ వేచి యటుండి యద్ది రాఁ
గనె శమనాశ నింక వెద♦కం దగునంచును బోయి రొక్కటన్. ౧౫॥ 2065

అఱువదిమూఁడవ సర్గము సంపూర్ణము.

---

## ౬౪ - వ సర్గము.

వానరులు సముద్రముచెంత కరుగుట.

క. హరివిక్రమమునఁ బొల్చెడు, హరివీరులు గృధ్రనాథుఁ ♦ డాడినపలుకుల్
పరికించి యెగిరి యందఱు, సురలన్ గుంపుగను గూడి ♦ మహితప్రీతిన్. ౧

క. హరినాదంబు లొనర్చిరి, హరు లాసంపాతిపలికి♦న ట్లాసీతన్
ద్వరగాఁ గనఁదలఁచుచు దుష్టరావణునివాసము గను♦సంతోషమునన్. ౨॥

తే. లంకకుం బోవ మార్గమా ♦ లవణజలధి
కరిగి; రాభీమవిక్రము♦లా కపులొగి
నచ్చటికిఁ బోయి గొప్పదై ♦ యలరు లోక
మునకుఁ బ్రతిబింబ మననొప్పు ♦ వనధి నచట. ౩॥ 2068

క. కని రది లోకమునంతయుఁ, దనలోఁ గనఁబడఁగఁ జేయు♦దర్పణమువిధం
బుననుండె; మహత్తరబలమునఁ దగు నాకపులు సంద్ర♦మును గని యంతన్.

తే. దానియుత్తరతీరంబు ♦ గానఁబోయి
యందు విడిసిరి; వికృతంబు ♦ నగుచు భూరి

* అభిజి దభిముఖాదిశం యయు ర్జనకసుతాపరిమార్గణోన్ముఖాః-అనిమా.

కాయ మలరఁగ వివృతవ♦క్త్రంబు నగుచు
వివిధసత్త్వగణంబందు ♦ వితతగతుల. ౫ 2070

*చ. జలములయందుఁ గ్రీడలను ♦ సల్పుచునుండెను; గొన్నిచోట్ల నా
జలనిధిభంగసంతతుల ♦ జంతుయుతిం దమిఁ గేళిసల్పుచ
ట్లలరుచుఁ గొన్నితావుల మ♦హాత్తరను త్తివి బొందినట్టుగాఁ
జెలఁగుచునుండె నొక్కెడ వి♦చిత్రమహీధ్రసమాంబుపూరముల్. ౬ 2071

క. కనఁబడుచుండె రసాతల, మునసుండెడు దానవాళి♦ముఖ్యులు నొకెడన్
గనఁబడుచుండిరి చూచెడు, జనులకు భయదంబుగాఁగఁ ♦ జను నయ్యబ్ధిన్.

తే. రోమహర్షకరంబును ♦ సూక్ష్మిఁ గాంచి, నట్టిదానిని గాంచి యా♦యంగదాదు
లెంతయు విషణ్ణులై రంత♦నెసఁగునబ్ధి, నాకసమురీతి దుష్పార♦మై చెలంగ.

క. కనుఁగొని వనచరు లందఱు, మనముల దిగులొంది యేమి ♦ మనకిఁకఁజేయం
గను దగుకార్య మటంచును, ననుకొని; కాకపిమహేంద్రుఁ♦డంగదుఁడంతన్.

చ. వనచరులామహాజలధి♦వర్యముఁ గాంచినయంతనే భయం
బును గనుఁగొంచి యూఱడిలి ♦ మోదము నొందఁగ హెచ్చరించె; నిం
ద్రునకును బౌత్రుఁడై సుమతి♦తోఁ దగు నంగదుఁ డార్తిమగ్నులన్
వనచరులం గనుంగొనుచుఁ ♦ బల్కెః విషాదము మీమనంబులన్. ౧౦ 2075

క. ఉనుపఁగరాదది యేష్టితిఁ, బెనుదోషము కుపితమైన ♦ పెనుసర్పము బా
లుని జంపురీతి దుఃఖమె, గనఁజేయును మృతిని, బురుష♦కాంతునినైనన్. ౧౧

క. పురుషుఁడు శౌర్యముఁ జూపెడు, తరుణమున విషాద మెవ్వి♦ధమునఁగలిగె నా
పురుషునిఁ దేజోహీను నొ,నరించుఁ బురుషార్థసిద్ధి ♦ నరున కతనికిన్. ౧౨

క. కలుగఁగనేరదు సుఁడీ! యని, పలికెన్ దన్నిశయుఁ గడువ ♦ వనచరవం క్తిం
గలిగిన వృద్ధుల నొకచోఁ, గలిపి సముద్రంబు దాఁటు♦కార్య మొనరుపన్.

ఆ. అంగదుండు మరల ♦ నాలోచన మొనర్చె;
నింద్రుఁజుట్టుఁ జేరి ♦ యెట్లు సురలు
వెలయుచుందురట్లు ♦ లలి నంగదునిచుట్టు
గొలిచియున్న ప్లవగ♦కూట మలరె. ౧౪ 2079

ఆ. అంగదుండు పవను♦నాత్మజుండును దప్ప, మఱియెవండు తా స♦మర్థుఁడగును?
భయదరీతిఁ బరఁగు ♦ వనచరసేనను, నిలువరింప నొకటఁ ♦ గలుప జగతి. ౧౫

క. పరమర్దనుఁడై సిరిచేఁ, బరఁగెడు నంగదుఁడు వృద్ధ♦వనచరులయు నా
వారిసేనయు ననుమతిఁ గొని, పరమార్థము లలరునట్టి ♦ పలుకులఁ బలికెన్.

క. గురుతేజుఁ డెవ్వఁ డిందున్, వరినధిపతి దాఁటఁగలఁడు ♦ శత్రుహారుండా
వరసిజబాంధవసూనుని, ద్వరఁగా సత్యప్రతిజ్ఞుఁ ♦ దతనమ్మోదున్. ౧౭ 2082

* క్వచి త్ప్రత్యక్షమాత్రే ౧ క్ష జలరాశిభి రావృతమ్-అనిమా.

క. ఒనరుపఁగలఁ డెవ్వండో, వనచరులారా! యెవండు ♦ వరవీర్యమునన్
వననిధి యోజనశతమును, ఘనగతి లంఘించి సాధు♦కార్యము దీనిన్. ౧౯

క. ఫలియింపఁ జేసి హరిసేనల కెల్లం బద్మసఖుత♦నయువలన నిఁకం
గలుగంవగు పెనుభయమును, గలుగఁగ నీకుంకఁ జేయఁ♦గలుగునొ చెపుఁడా.

సీ. ఎవ్వనిమహిమచే ♦ నిఁక మనమెల్లను గార్యసిద్ధిం బొంది ♦ కదుముదమునఁ
బురమునకున్ సుఖం♦బుగఁ బోయిమనభార్యలనుబుత్త్రులగృహము♦లనుగనంగఁ
గల? మదెవ్వని యను♦గ్రహమున సంతోషమందుచు బలశాలు♦రైనరామ
లక్ష్మణసుగ్రీవు♦లను జూడఁ దత్సన్నిధికిఁ బోవఁగలము మ♦తిస్థిరుఁ డగు

తే. నెవ్వఁడేనియు మీయందు ♦ నీజలనిధి
యోజనశతంబు లంఘింప ♦ నోపునేని
యాతఁడిప్పుడె వేగంబ ♦ యభయదక్షి
ణను మహాపుణ్యదంబు మా♦కును నొసఁగుత. ౨౧ 2085

క. అని యంగదుండు పలికిన, విని యందెవ్వఁడును బదులు♦విషయము దేనిం
జనువునఁ బలుకండయ్యెను, వనచరసేన యది మ్రాను♦పడియుండెఁ దగన్.

క. హరిసత్తముఁ డాయంగదుఁ, డురువాగ్గుంభనము లొప్ప ♦ నొగి మరల హరీ
శ్వరులం గని యిట్లనియెన్, వరవిక్రమములను భూరి♦బలమున మీరల్. ౨౩

ఆ. యశముఁ గాంచినారు ♦ హరివరకులమునఁ
బుట్టినారు మిగులఁ ♦ బూజ్యులగుచుఁ
బరఁగినారు కీశ♦వరులార! మీలోన
నెవ్వఁడేని యెప్పు♦డే నదెందు. ౨౪ 2088

క. గతి నడ్డులేనివాఁడెగ,ద తగన్ దూరంబదెంత ♦ దాఁటంగల యు
ద్ధతశక్తిఁ గలదొ యెవనికి, హితముగ వచియింపుఁ డిట్టు♦లేలొకో? యుండన్.

అఱువదినాలుగవ సర్గము సంపూర్ణము.

---

## ౬౫ - వ సర్గము.

కోఁతులు తమతమసామర్థ్యంబులఁ జెప్పుట.

క. అనియిట్లంగదుఁ డాడిన, విని వానరసంఘమందు ♦ వీరులునయి యొ
ప్పినయట్టి గజముఖులు తమ,కును గతిఁగల శక్తులను వి♦గూఢముగాఁగన్.

సీ. పలికిరి గజగవా♦క్షులు గవయుండును మఱి శరభుండును ♦ మైందుఁ డట్లె
ద్వివిదుండు ఘనతర♦తీవ్రవిక్రముఁడైన యాగంధమాదనుఁ ♦ డాసుషేణుఁ
డాజాంబవంతుఁడు ♦ నంగదుఁ గనుఁగొని తమశక్తులను జెప్పఁ♦దలఁచి; రందు
గజుఁడు యోజనదశ♦కంబు నేదాఁటఁగాఁ గలనంచుఁ బలికెనా♦గతిగవాక్షుఁ

తే. డిరువదియొ యోజనంబుల ♦ నేను దాఁటఁ
గల ననియెను వనచరుఁ ♦ గని గవయుఁడు
ముప్పదే దాఁట యోజన♦ములను శక్తి
గలుగువాఁడ నటంచని ♦ పలికె నంత. ౪ 2091

క. వనచరపూజ్యుఁడు శరభుం, డనె నలువదియోజనముల♦యంతటిదూరం
బును దాఁట శక్తిగలదని;, యనుపమశౌర్యంబు మీఱ ♦ నలరి ఘనుండై. ౫

క. తనరారు గంధమాదనుఁ, డనె నేఁబదియోజనముల♦యంత నెగురఁ జా
లినశక్తిగలదు సందియ, మనరాదని; మైందుఁ డప్పు ♦ డక్కపిగణమున్. ౬

క. కనుఁగొని నే నఱువదియో, జనములు లంఘింప మిగులఁ ♦ జాలుదు నని చె
ప్పెను; నంత ద్వివిదుఁ డన నొ, ప్పిన సూనుఁడు డెబ్బదేను♦బృథువేగమునన్.

తే. దాఁటఁ జాలుదుననియె; నం♦తట సుషేణుఁ
డనెడు వనచరకుంజరుఁ ♦ డప్పుడనియె
నొక్కరీతిని నెనుబది♦యోజనములు
దాఁటఁజాలుదునని సమ♦స్తకపు లిట్లు. ౮ 2095

క. పలుకుచునుండఁగ జరచే,త లలిన్ వివిధప్లవంగ♦తతి మించెడు ను
జ్జ్వలమూర్తి జాంబవంతుఁడు, పలికెం దదనుజ్ఞఁగొని ప్ల♦వంగములారా!.

[1]క. మును మాకు గతిపరాక్రమ, మున నతిశయశక్తియుండె ♦ ముసలితనముచే
త నిపుడు జర్ఝరితంబగు, తనువున నున్నారమైనఁ ♦ దత్త్వము వినుఁడీ!. ౧౧

చ. వనచరనాయకుండు రఘు♦వర్యుఁడు చేయఁగఁ బూనియున్న యి
ప్పనిని నుపేక్షసేయుటకు ♦ భావ్యముగాదు వయస్సు పోయి కా
లనియతి ఖేదమైనతఱి ♦ లావున దాఁటఁగ నెంతదూర మీ
తనువున శక్యమౌనొ నిట ♦ దాఁపక మీకెఱిఁగింతు నేనొగిన్. ౧౨ 2098

తే. యోజనంబులు తొంబది ♦ యుదధిమీఁదఁ
బోవఁజాలుదు సందియం♦బు వలదింక
ననుచు మరలను వారలఁ ♦ గని వచించె
వయసునందున్నతఱి నాదు♦వపువునందు. ౧౩ 2099

సీ. తనరెడుగతి నమ♦ర్థత యింతమాత్రమే గాదు పూర్వము బలి♦క్రతువునందు
శాశ్వతుండై నట్టి ♦ చక్రి త్రివిక్రముం డయి పదత్రయమున ♦ నఖిలలోక
ములను గొల్చెడుతఱి ♦ వెలసిన యతనియాకారంబునకుఁ జుట్టుఁ ♦ గమ్రశక్తిఁ
తనరఁ బ్రదక్షిణం♦బును జేసినాఁడను వయసున నొరుల కె♦వ్వరికి లేని

తే. యసదృశంబగుగతి శక్తి ♦ యలరుచుండె,నట్టి నేనిప్పు ముదిమిని ♦ నందినాఁడ
బ్లవనమున మందశక్తి నా♦పాలఁబడియె,నిప్పుడేనింతమాత్రమే♦యెగురఁగలను.

1 పూర్వ మస్మాక మప్యాసీ త్కశ్చి ద్గతిపరాక్రమః-అనిమూ.

క. అని తలఁచుచున్నవాఁడను, వినుఁ డీలంఘనముచేత ♦ విపులంబగు ని
ప్పని నెఱవేఱదుగా యని, వనచరు లెల్లరు వినంగఁ ♦ బలికెఁ గడంకన్. ౧౭

చ. వనచరవర్యుఁ డంగదుఁడు ♦ ప్రాజ్ఞవరుండగు జాంబవంతునిం
గని తదనుజ్ఞఁ బొంది యిఁకఁ ♦ గాఁ దగు కార్యమునందుఁ బూన్కిఁ జే
యను దగునట్లుదారమగు ♦ నర్థము గల్గఁగఁ జెప్పె నిట్లుగాఁ
దనదగుశక్తిరీతిఁ బ్రమ♦దం బలరారఁగ నాలకింపుఁడీ. ౧౮ 2102

[1]క. వనచరులారా! శతయోజనములు దాఁటంగఁ దగిన♦శక్తి గలదు నా
కునుగాని మరలివచ్చుట, కనువగు లాఘవము గలదొ ♦ యయ్యది లేదో. ౧౯

[2]ఆ. నిశ్చయింపఁజాల ♦ నేను నా విని వాక్య,కుశలుఁడగుచుఁ బ్లవగ♦కుంజరుఁడయి
తనరు జాంబవంతుఁ ♦ డనియె నంగదుఁ జూచి, ప్లవగభల్లనాథ!♦వాలితనయ!.

ఆ. తెలిసినదియె నీకుఁ ♦ గలుగు లంఘనశక్తి, శతమనంగనేల ♦ సరిగ వేయి
యోజనంబులైన ♦ నురుగతి లంఘించి, మరల రాఁగఁగలవు ♦ మాటలేల.

క. పరిజనులు ప్రభువు నొకపని, కరుగం దగునంచుఁ బంపు ♦ నాచారము లే
దరసిన నెందును గావునఁ, బరిజనులము మేము నిన్నుఁ ♦ బంపుట తగునే.

[3]క. వనచరవర్యా! తండ్రీ!, తనజనులను బంపఁ బ్రభువు ♦ తగుఁగాని, స్వభృ
త్యనికరము తన్నుఁ బంపఁగఁ, జనఁదగునే యిట్టులెందు ♦ శాస్త్రము గలదే!.

సీ. పరనిషూదన! మాకుఁ♦బ్రభువుగానీవుంట మేమందఱమునిను♦మిగులఁబూన్కిఁ
గాపాడుకొనఁదగు; ♦ త్స్వామిపతి సైనికులకునెల్ల సర్వదా ♦ ప్రకటశక్తిఁ
గాపాడుకొనఁదగు ♦ కన్నవస్తువుగదా? యిది లోకసంస్థితి♦యేయగుఁ జుమి;
కావున నిన్ను ర♦క్ష్యంబగువస్తువులె నిరంతరము గా♦పాడుకొనుట

తే. మాకు ధర్మ మరిందమా! ♦ యీకరణిని
నీమహాకార్యమునకెల్ల ♦ నీవె మూల
భూతుఁడవు మూలమెట్టులు ♦ భూమిరుహాము
నకుఁ బ్రధానమొ యట్టులె ♦ నయగుణాఢ్య. ౨౪ 2108

క. పని కంతకు నెయ్యది చ,క్కనిమూలమె యట్టిదానిఁ ♦ గాపాడుటయే
ఘనకార్య మిదియె నీతియ,గును గార్యజ్ఞులకు; నిదియ♦గును ధర్మమిలన్.

క. తరువునకు వేఱు చక్కఁగఁ, బరికింపఁగనైనఁగాని ♦ ఫలపుష్పంబుల్
సరిగా నుదయించుటయుం, బెరుఁగుటయును గల్గు; సత్య♦విక్రమ! యెపుడున్.

చ. విను మిఁక నీను కార్యమును ♦ వేయివిధంబుల సిద్ధినొందఁ జే
యను మతివిక్రమంబుల స♦యంబున నీవె ప్రధానకారణం

---

నివర్తనేతు మే శక్తి స్స్యాన్న వేతి నవిశ్చితా - అనిమూలము. 2 ప్లవగకుంజరుఁడు-ఇటఁ బ్లవగశబ్దము సర్వవనచరవాచకమనిగ్రహింపఁదగు. 3 నహి ప్రేషయితాం తాతస్వామీ - అని మూలము.

బనఁ దగియున్నవాఁడ విది ♦ యంతయు సత్యము నీవె లంకకుం
జనిన మఱెట్లు మాకుగతి ♦ చక్కఁగ నెంచుము! కీశనాయకా!. ౨౬ 2111

¹క. గురుఁడవు గురుపుత్రుండవు, పరికింపఁగ నిన్ను నమ్మి ♦ పరమంబగు నీ
గురుకార్యము సాధింపఁగ, నరుదెంచితి మీవు లేక ♦ యది యెట్లలరున్. ౨౭

ఆ. మాకు నెట్లు శక్తి ♦ యీకార్యసాధన
మందుఁ గల్గు; ననియె ♦ ననఘమతియుఁ
బ్రాజ్ఞవర్యుఁడునయి ♦ వఱలు నాజాంబవం
తుండు శక్రపౌత్రు♦తోడనిట్లు. ౨౮ 2113

²చ. పలికిన వాలిపుత్రకుఁడు ♦ బాగుగ నాతనిఁ జూచి యివ్విధిం
బలికెను లంకకేఁ జనక ♦ వానరుఁ డెవ్వఁడుగాని పోక యీ
స్థలముననున్నచో మరలఁ ♦ జక్కఁగ ముందటియట్లె ప్రాణముల్
వెలువడు నావ్రతంబున గ♦భీరమతీ! యిపుడూననౌఁగదా!. ౨౯ 2114

సీ. ధీమంతుఁడగు కపి♦ధీరునియాజ్ఞను బాలింపకయె మాన♦పరిమితమగు
గడువును దప్పి న♦గరమున కేగిన మనప్రాణములు చూడ ♦ మనవి కావు
గద! యల్లసుగ్రీవుఁ♦డు దయఁబూనిన నాగ్రహంబుఁబూనినఁగాని♦యత్యధికమె
యతని యానతిమీఱి ♦ యరుగుదుమేని వినాశనంబగును మ♦నకుఁ దలంప
తే. సర్వవిదుఁడవు కార్య మే♦సరణి మనము
తలఁచినట్లుగఁ గాత యి♦త్తఱిని వేఱు
విధముగా సిద్ధినొందెడు♦విధము నీవె
చక్కఁదలపోయుమా! యని ♦ సాధుమతిని. ౩౨ 2115

క. సురపతిపౌత్రుఁడు తన కు,త్తరమును జెప్పంగ వీర♦తల్లజుఁడయి వా
నరముఖ్యుఁడైన భల్లుక, వరుఁ డప్పుడు విని వచించెఁ ♦ బ్రౌఢిమ తనరన్. 33

క. వీరా! నీకార్యమునకు, నేరీతిం గొఱఁత కొంచె♦మేఁ గలుగదు నూ!
యారసి యీకార్యంబును, శూరత సాధింపఁ గల్గు ♦ శుభగుణు నొకనిన్.

తే. పంపుచున్నాఁడ నిదిగో యో♦వాలిపుత్ర!
యనియె; నంతటఁ బ్లవగాళి♦యందుఁ జూడ
నుత్తముండయి వృద్ధుఁడై ♦ యొప్పు జాంబ
వంతుఁ డచ్చటికపులను ♦ వరుస వదలి. ౩౪ 2118

చ. నిరుపమవిక్రమంబునను ♦ నేర్పఱియై బలసంపదన్ మహా
త్తరుఁడయి ఖేచరాళిని ని♦తాంతము వర్యుఁడు తానెయై మనో

---

1 గురుర్వా గురుపుత్రశ్చ-అనిమూ. ఇట గురుశబ్దము ప్రభుపరమని గ్రహింపఁదగు. 2 ధ్రువఃఖల్వేద మస్మాభిః కార్యం ప్రాయోపవేశనమ్-అనిమూ.

